వక్షమున సిరిగలుగువాఁడవైయుండి
భిక్షమెత్తినయట్టి పిన్న బ్రాహ్మణుఁడ ॥ ,,

మదమత్తులైయున్న మానవేశ్వరుల
వెదకి ఖండించిన విశ్వలోకేశ ! ॥ ,,

రామచంద్రుండవై రావణునిఁద్రుంప
భూమి నాయాసంబుఁ బొందినావయ్య ॥ ,,

వ్రేపల్లెలోనిపుడు గోపకాంతలను
జేపట్టిరక్షించు చిన్నికృష్ణయ్య ॥ ,,

ఇలఁబూడివాఁడలో నెలమిమీఱఁగను
వెలసియున్నట్టి శ్రీ వేణుగోపాల ! ॥ ,,

నిదురబో నాతండ్రి ! నిదురబోవయ్య !
నిదురబో సుకుమార ! నిశివచ్చెఁగాన ॥ ॥ జోజో ॥

# మేలుకొలుపు

" గుమ్మఁడేడే గోపిదేవి వలె "

మేలుకొనరా ! బాలకృష్ణా ! మేలుకొనరా ! మదనరూపా !
మేలుకోవయ్యా కృష్ణయ్యా ! । ।
మేలుకో ॥

తెల్లవాఱెను గొల్లభామలు చల్లఁజేసిరి వెన్న ముద్దలు
కొల్లలాడఁగవేళమయ్యె మేలుకో ! కృష్ణా ! నీవు ॥ మేలుకో ॥

కడుపులోనున్నట్టి జగములఁ గన్నతల్లికి నోరుఁదెఱచిగ్రక్కునఁ
జూపింపనీవు ॥ మేలుకో ॥

బాలకులతోఁగూడి వేగమె యాలమందల మేపనడవికిఁ దోలుకొని
పోవంగవలయు ॥ మేలుకో ॥

రాలవాన గురియసాగెఁను దాళఁజాలరు గోపకుల నీకేల
గోవర్ధనమునెత్త
॥ మేలుకో ॥

తీరుగా యమునాస్రవంతీ తీరమున గోపాలబాలల చీరలున్నవి
దొంగిలింప ॥ మేలుకో ॥

పున్నమవెన్నెల వచ్చెను బొన్నమ్రాని మీఁద నెక్కి తిన్నఁగా
వేణువునునూద ॥ మేలుకో ॥

గోపికామహిళామతల్లులు గుంపులైవచ్చిరి వారిఁగూడి రాసక్రీడ
సలుపగ
॥ మేలుకో ॥

మామగారి కబురువచ్చెను మానుగా బలరాముతోడ మధురకు
నరుగంగనీవు ॥ మేలుకో ॥

ద్వారకాపురమందుఁ బదియాఱువేల రాజ కాంతలఁ జేరి
ఆనందింపనీవు ॥ మేలుకో ॥

పూడివాడవాస ! నీకుఁ బూజలు సేయంగ మౌనిపుంగవులు
విచ్చేసిరింక ॥ మేలుకో ॥

తెల్లవాఱెను మందమారుత మల్లన వీతెంచి నిదిగో ! మెల్లఁగా
మేల్కొనుముతండ్రి ॥ మేలుకో ।